# నాగేశ్వర శతకము.





[illegible] నాగభూషణదేవర.

# నాగేశ్వర శతకము.

చ॥ హరిశివునందుగల్గు దృఢభక్తినొనర్చితిగాని దీనిసే
నెరుగను దోషసంతతుల నించుకయైనను శాస్త్రపాండితీ
గరిమము లేదుగాన నిటగల్గినతప్పులు లెక్కసేయకా
దరమునగైకొనుండు విబుధప్రభులారనుతింతు నెప్పుడున్



శ్రీ శివాయ నమః

# నాగేశ్వరశతకము

---

శా॥ ప్రాలేయాచలకన్యకాధవుఁడు సద్బ్రహ్మాండభాండావళిన్
మూలాధారుఁడు పాలనాకరుఁడు నిర్మూలింపఁగాఁ గర్తయున్
కాలాకాలనివేశదక్షుఁడు హిమద్గాంధరుం డెప్పుడున్
శ్రీలావ్పారనివాసిగా బ్రోవుత నన్ జేప్రోలునాగేశ్వరా॥

శా॥ శ్రీవిఘ్నేశుపదారవిందయుగళిన్ సేవల్ ఘటింతుం దగన్
శ్రీవత్సాంకితవందనీయు సభవున్ శ్రీచంద్రజూటాత్మజున్
ప్రావీణ్యున్ గరుణానిధిం భవహరుం ఫాలంబునన్ బ్రొక్కి నే
సేవింతున్ గణనాథునిన్ గజముఖున్॥ ......

శా॥ దక్షుం ద్రుంచియు యజ్ఞశాలనపుడే ధ్వంసంబుగావించి యా
యక్షవ్రాతము సిద్ధగుహ్యక సమస్తాదిత్య దైతేయులన్
వక్షంబుల్ కదలం జించి బ్రహ్మను హరిన్ బల్మారు ఘోరంబుగా
శిక్షల్ జేసిన వీరభద్రుని దలంతున్॥ ......

శా॥ వాణీ! పల్లవపాణి నీవమృతసద్వాక్యంబులన్ గూర్చి గీ
ర్వాణాంధ్రాదిసుభాషితంబులు మహాభాష్యోక్తిసాధుత్వమున్
బ్రాణాయామము బ్రహ్మనిష్ఠయు నెరుంగన్ గాన నీసత్కృపా
శ్రేణిన్ నన్ను కృతార్థు జేయగదవే!॥ ......

మ॥ వరమాహేశ్వరవర్ధనుండు హరుడున్ వర్ణింప పరవాదులన్
నిరసన్ జేసి జయించి నట్టి ఘనుడున్ నిర్మోహితున్ బండితున్

# నాగేశ్వరశతకము.

వరదేశుఁ డనిశంబు గొల్తు మదిలో వర్ధిల్ల వేగంబె యీ
చిరుతంబైనటువంటి పద్యశతముఁ॥ ......

మ॥ అవనిన్ భక్తులనామముల్ దలచెదన్నాసక్తిచే నామదిన్
శివనాగయ్యను కల్లిదేవయ మఱిన్ శ్రీసిద్ధ రామార్యునిన్
సువివేకుఁ గణపాలు గుండయను సుశ్లోకుండు భల్లాణునిన్
శివచిర్యాలుని సాంఖ్యతొండనిసదా!॥ ......

మ॥ గొలుతుఁ మోళిగ మారయాహ్వయుని ప్రముఖుల్ జేతు సోమయ్యకున్
కలికద్విప్రహ్మయ నాత్మదేవయను కక్కయ్యాది సద్భక్తులన్
తలయందుఁ ధరియింతు శర్వసభవుఁ ధ్యానించి కేల్మోడ్చు భా
సిల సంపూరిత భక్తి సంగతుడనై॥ ......

మ॥ మడివాల్ మాచయ బిచ్చిబాచనిమిషుఁ మండాగి మాత్రాఖ్యునిన్
నిడుమార్యుఁ గరయూరిబోడుని శివానేకాంత రామయ్యనుఁ
కడవల్ శంబిని నాచిదేవ్రుని మదిన్ కల్యాంబనై వారునుఁ
చిదకన్ బాలును వారి పాదములనే॥ ......

మ॥ అరిపాలుఁ బసవేశు నిమ్మవను నాహోలాయుధుఁ బాణునిన్
కరికాల్ చోడుని సంగమేశ్వరుని యోగంధర్వ నిర్వత్తునిన్
ఉరవందాండని మల్ల బ్రిహ్మయ ఘనుఁ యేణాధి నాధీశునిన్
సిరిచేకూర్చెదు నీశ భక్తి దలతుఁ॥ ......

శా॥ శ్రీకళ్యాణ గుణాకరుండభవుఁడున్ శ్రీకంఠుడాద్యుండు సు
శ్లోకుండీశుడు నప్రమేయు విబుధా శోభావినీతుండనన్
సాకారంబున శంభుమూర్తి యనగన్ సాక్షాత్కరించెన్ భువిన్
శ్రీకారుణ్యుని మద్గురుఁ దలచెదన్॥ ......

మ॥ అతులంబైన మహాకవీశ్వరుల నేనారూఢి సంప్రీతిచే
స్తుతులన్ జేయుచు దాల్తుపాల్కురికి నాసోమేశ్వరాధీశు మం

డిత కీర్తిన్ పిసుకర్తి సోమఘనఖండేశాది ధీరాళి కం
చితమౌ వందనముల్ ఘటియింతు నెపుడున్॥ ......

మ॥ పరిశోధించగలేను శాస్త్రముల సద్భావంబుచేఁ గావ్యముల్
నెరుగన్ జూడగలేదు వ్యాకరణమున్ నీమీఁద వాంఛారతిన్
విరచింతున్ శతకంబు నొక్కటిఁ గవుల్ వీక్షించి తప్పుల్ కడున్
స్థిర చిత్తంబున దిద్దఁ బ్రార్థితుడ నే॥ ......

శా॥ శ్రీకంఠాయ త్రిలోచనాయ విమలశ్రీచంద్రజూటాయ భో
గీ కంకాళిక పాలమాల ధవళాంగీ సర్వభూతాయ స
త్పాకారిప్రముఖార్చితాంఘ్రి భజనభ్రాంతిన్ దగన్ గొల్చినీ
శ్రీకారుణ్యము వేఁడ జూడుము శివా॥ ......

శా॥ శ్రీవిద్యోత్కవితాజవంజవమహా శ్రీసచ్చిదానందయో
గావిజ్ఞాన విశాలదుండ హరుడా గంగాంబికా వల్లభా
రా వేగంబున మన్మనోబ్జములరన్ రారాజుకు న్మిత్రసి స
సేవల్ తామరతంపరై మునియెదన్॥ ......

మ॥ నిఖిలామ్నాయ పురాణశాస్త్ర వినుతా నిర్మోహ సంధానవే
ద్యఖిలాత్మైక్య కళాపరిపూర్ణ బుధమోహవ్రాత సంహారివై
యఖిలాధీశ్వర యిందుసుందరహరా దాక్షిణ్య భావంబునన్
శిఖినేత్రా కృపజూడు నెప్పుడు ననుం॥ ......

శా॥ యక్షౌ ద్యక్షకత్ర్యక్ష రక్షక దయాధ్యా! సాంబ సర్వేశ స
దృక్షౌ వీక్షకటాక్షవీక్షణ శివా దుష్టాత్ములం జెందఁగన్
దక్షౌశీసముముక్షు మోక్ష ఫలితార్థంబున్ గృపంజేయుమీ
శిక్షౌదక్షతగల్గు శంకరదయన్॥

శా॥ కొండల్ ఘూర్ణిలు నబ్ధివణ్కుదిశలున్ ఘోరాటవుల్ గ్రమ్మ
బ్రింహ్మాండంబెల్లను వ్రయ్యలౌ పరగ బ్రిహ్మాదుల్ మహాభీతిచే
నిం డీకొన్న దొలంగు నీపటిమకున్ నే నిల్వఁగా నేర్తునే
చెంపన్ రాదె మదీయపాప తతులన్॥ ......

# నాగేశ్వర శతకము.

శా॥ మారాహార కరాళభీకర మహామార్తాండ తేజోనిభా
కారా సుప్రభ కాంచనాద్రి విలసత్కళ్యాణ ధాముండవే
యేరా నామొర యాలకింపవు శివా యేజేయు దోసంబులన్
చేరన్ రాక దొలంగ జేయుము భవా॥ ......

మ॥ ధరణీచక్రము తేరు చంద్రరవులుద్యచ్చక్రయుగ్మంబు
పరమేష్ఠీరథసారథాయె హయముల్ పాత్రంబులా
వేదముల్ హరియే సాయకమైధరన్ త్రిపురసంహారంబు
గావించి నీచరితంబెన్నగ విన్న వింతగదరా ......

శా॥ సారాచారవివేకశీల సుగుణా సంకల్ప మా
త్రుండవై నిరమ్మన్యుడవై సురాసురలకున్ వీక్షింపనుగ్రుండవై
భూరిన్ జీవులకెల్ల పోషకుడవై పుత్రుండనౌ నన్ను నీ
చేరందీసియు బ్రోవనీదె భరమో॥ ......

మ॥ దివియం దుద్భవసిద్ధసాధ్య విబుధధ్యేయుండు గంధర్వులున్
వివిధానేక ఋషీశ్వరాదిప్రమథుల్ విద్యాధరుల్ కిన్నరుల్ య
వనిన్ యోగులు నాకవాసులు ఫణీంద్రాధీశులైనన్ మదిన్
శివ నీరూపము నిర్ణయింపగలరే॥ ......

మ॥ కమలాప్తావర సుప్రభా విమలసద్గాంభీర్యశౌర్యోద్గుణా
ద్గనుమై వీరపటీరధుర్యవిలసత్ కంజోద్భవస్తుత్య యా
శమనుం జంపిన దేవ బ్రోవుము ననున్ శాసించు
భక్తుండనంచెంచి మదిన్ ప్రేమను జూడు మోహరశివా॥ ......

శా॥ శ్రీకైలాసనివాస నీదుమహిమన్ సేవింతు నశ్రాంతమున్
పాకారాతిపరేతరాజఫలభుక్ పానీయరాట్ పూజితా
కోకప్రీతికరాబ్జవహ్నినయనా గోరాజసద్వాహనా
చేకొమ్మా కడు దీను వందనములన్॥ ......

మ॥ కరిచర్మాంబరధారివై గరళమున్ గంఠంబునం దాల్చితే
వరచే బ్రహ్మకపాలమున్ పునుకయున్ నాగేంద్రహారంబులున్

# నాగేశ్వరశతకము.

ధరియింపం గని నీదుపాదములు సంధానింపనె ట్లొప్పిచే
సిరి నీభక్తులు వారిమానసములన్॥ ......
గురువై భక్తులపాలి కల్పతరువై క్షోణ్యంతరాళంబునన్
నిరపాయంబుగనుండి సమ్మిళితమై నీవారశూకంబునై
మెరుపై ముక్తికిమూలమై ధరణిలో నే
రూపమున్ గానిదై స్థిరమై వెల్గును నీసురూపమరయన్॥ ......
॥ జీవుల్ మత్తులుసంపదల్ గలిగినన్ జింతింప విస్మర్త్వరే
జీవల్ భ్రాంతి దొలంగ లేకపుడమిన్ శ్రీలంచువర్తింత్రుగా
జీవుల్ శాశ్వతమైననీదుపదవిన్ జెందంగసద్భక్తి నీ
సేవల్ జేయరు నమ్మి మానసమునన్॥ ......
॥ దేవేంద్రానిపదంబునిత్యమనినన్ దేవేంద్రునిన్ రక్కసుల్
వేవేగంబున పారద్రోలి సురలన్ వేధింపగా వేల్పుల్
నీవే దిక్కని తావులన్ విడచియున్ నిన్గోరిసేవించి నీ
సేవన్ సంతతమిచ్ఛయింతురుగదా॥ ......
॥ ఏలీలన్ నుతిసేతునిన్ననిశము న్నేరీతిసేవింతునో
ఫాలాక్షా! నలకూబరాదివినుతా! పాపౌఘవిధ్వంసకా
కాలున్ ద్రుంచినకాలకంఠుడవు నీకారుణ్యమున్ జూపుమో
శ్రీలక్ష్మీపతిసేవితాంఘ్రియుగళా!॥ ......
॥ నాదాతీతుడ! చిన్మయా! యచలుడా! నాకేశవద్యుండ నీ
వాధారుండవుసజ్జనావళికిఁ బూర్ణామోదసంధాయివై
మేధాశక్తులొసంగిబ్రోచెదుహరా! మీపాదముల్ వేడితిన్ శ్రీదా
నామొఱనాలకింపుమభవా! ......
౫। గతినీవేయని వేడగా మమతచే గష్టుండు దుష్టుండు ధీ
మతిహీనుండును లోభదూషితుడు దుర్మార్గుండు పాపుండు కు
చ్ఛితుడున్ పామరుడంచు ద్రోయకను నాచింతల్ నివారింపుము
ద్ధృతపాపస్తుత పాదపద్మయుగళా! ......

# నాగేశ్వరశతకము.

శా॥ నీడారూపము చిన్మయంబచలు డాసిర్ణీత చైతన్యమా
వేదార్థంబగునిర్గుణంబ పదమా వీక్షింపరానట్టిదా
కాదా నీసగుణంబు జూపుమిపుడున్ గాంక్షించి పూజింతునే
శ్రీదామోదరవందితా పరశివా॥ ......

శా॥ ఏదయ్యా యికదిక్కు నీవలుగగా నేదారిబోఁగన్ శివా
నేడేనింగని యూరకుందునిపుడున్ బృందారకస్తుత్య యా
వేదంబుల్ గనలేనిరూప మెదలో వీక్షించు టెట్లోకదా!
శ్రీదేవావళికెల్ల నాథుడవుగా......

మ॥ మలమూత్రాస్వితమైన యీతనువుపై మాయానుసంధానులై
తలిరుంబోణులతోడ గూడుచు సుధాంధశ్చక్రిసంస్తుత్య యీ
కలికాలంబున నీదు సత్కథల నాకర్ణింపరయ్యయ్యో! యా
చెలులం డెక్కడనేమిగల్గునో హరా!......

మ॥ ధనమే శాశ్వతమంచు నమ్మి జనముల్ ధర్మంబులన్ జేయకన్
దినముల్ పుచ్చుచునుందు రిపుడమిపై ధీరత్వసంచారులై
తనువే బోయెడు వేళ నీధనము వెంటన్ వచ్చి రక్షించునే
చెనటుల్ నీమహిమం బెరుంగరకటా......

శా॥ సంతానంబదిగల్గ లేదని నరుల్ సన్యాసులన్ గాంచి తా
మెంతోభక్తిని జెప్పగావినియుఁ దామేవేళ సత్కర్మముల్
యెంతో చేసినసంతతిన్ గనకటన్నిద్రాహారముల్ గాంచరీ
చింతన్ బాసియు నిన్దలంపరుగదా......

శా॥ శ్రీజీవమూరమణుండు నాశుగముగాఁ బృథ్విన్ శతాంగంబుగా
నారారాభవుండు సూతుసిగ స్వర్ణాద్రిన్ శరాసంబుగా
ధీరత్వంబు జెలంగగా ద్రిపురముల్ దేవా వడిన్ గాల్చితౌ
శ్రీరామార్చిత నన్ను బ్రోవ భరమా......

శా॥ ఆలుంబిడ్డలు తల్లిదండ్రులు నితాంతార్థంబు వ్యర్థంబులై
వాలాయంబుగ నాపదల్ గుడుచుచున్ వాపోవుచున్ మానవుల్

# నాగేశ్వరశతకము.

మేలుఁ జెందగలేక పాపులగుచున్ మిథ్యానుగర్వాంధతన్
చీ లోభుల్ పరతత్వమొందు గనరే ......

మ॥ కులమా లేదుగ గోత్రమా వినము నీకున్ తల్లి దండ్రిదు లీ
యిలలో లేరు యెఱుంగబోరు యెవరున్ని రూపు నీమాయయున్
బలుచిత్రంబులు నెందుజూచిన సహా బాహ్యాటమా నెంచ గాదు
శిల నన్నెట్టకు బోవవే హరహరా! .....

మ॥ పరవాదంబుల జేయుచుంట యెప్పుడున్ ప్రాణాపహాత్యాదులన్
సరవిన్ జేయుట తన్ను దా బొగడుటల్ సాధించుటల్ తండ్రిపై
గురుని న్నిందయొనర్చుటల్ కుటిలులై కూడంగ రాదంచు నెం
చిరి దా జేయురు పృథ్విలోన కుజనుల్ ......

శా॥ ప్రాతఃకాలమునందు లేచి వెసమీపాదంబులన్ భక్తితో,
శ్రీతోయంబులు దెచ్చి యర్చనములం జేసో ముదంబొప్పగా
బ్రీతిన్ బూజలొనర్చుటల్ విడిచి స్వామీ ప్రేమతో కాంతలన్
చీ తప్పంచు చరించుచుందురుగదా! ......

శా॥ యజ్ఞంబుల్ భువి జేసి దుర్గతుల బాయంజేసి జీవ్రుందు నిం
ద్రాజ్ఞన్ స్వర్గసుఖంబులన్నిటిని దా సన్మాత్రుడై చెందు నా
యజ్ఞాధీశ్వుని నిన్నెరుంగకిటులీ యజ్ఞంబులన్ జేసి పై
జిజ్ఞాసంబడు చుండ్రిగాదె గిరిశా ......

మ॥ బయలై యుండెను బ్రహ్మవస్తువన నా బాహ్యాంతరం బంతటన్
నియమం బేటికి యింతయంతియనుచున్ నిర్ణింపగా జెల్లునే
ద్వయభేదంబుల నెంచకన్ సమతచే ధాత్రిన్ యనంతంబుని।
ప్రీతియుతన్ జెంది భజింప మోక్షమన రే......

శా॥ ఖండాఖండప్రపంచమందు గన నాఖండేందుధారుండు యా
నిండాఖండతనుండె దాడిగను వాసింగాంచగా లేక నీ
ఖండాఖండములైన రూపశిలలన్ గాంచించి పూజింతురే
చెండీశేశ్వరయందు నేమిఫలమో ......

శా॥ సర్వాతీతమయుండగమ్యుడు మహాశాంతుండు శంభుండు ని
ర్వాణుండును మంగళుండు ఘనుడున్ సచ్చింతుడున్ నిత్యుడున్
సర్వాత్మానిలయుండు శంభుడనుచున్ శాస్త్రంబులం జెప్పె నా
శర్వాదంబు నొసంగుమయ్య జనుడన్ ......

మ॥ ప్రణుతింతున్ బ్రణవస్వరూప ఘనభాస్వత్తేజ ఫాలాక్ష ని
ర్గుణ దక్షాధ్వరభాగ లోకభరణా గోరాజ సద్వాహనా!
ఫణిభూషా విమలాత్మపూజ్యుడ మహాపాపఘ్న యేవేళ జే
ర్చినిరున్ వేడుదు నాదుమానసమునన్ .. ...

మ॥ ధరలో నుత్తమధర్మశీలమును చిత్తంబీశ్వరాయత్తము
న్నరయన్ జేర్చి నటించుమాస్యవరునిన్ నా పుణ్యపాపంబులున్
హరినిన్ గాంచు గజంబు లాత్మగతమున్ హంకారముల్ మాని దా
శిరముల్ వంచి ధరించవా పరశివా ......

మ॥ భవమాపోవును మాన్యతాగౌరవ లాభంబౌగదున్ సంభవిం
చు వయోరూపత యాయువున్ దెలసెడిన్ శోధింప విద్యాదిబు
ద్ధి విధానంబులు శ్రేయముల్ గలుగవా దేవౌఘసంపూజితా
శివ నీ నామముసర్వభద్రముగదా ......

శా॥ ఎందెదున్ గనసందులేదు పుడమిన్నెమందు నీరూపమున్
సందేహంబును లేక సర్వవిధులన్ సాధించు బ్రహ్మంబు ని
యందే యున్నది మూడుమూలలగదున్ యారాధిచే జూచినన్
జెందున్ మోక్షమటంచు బల్కిరిబుధుల్ ......

శా॥ ఎన్నెన్నో వ్రతదానశీలతపము ల్యెన్నో మహాస్తోత్రముల్
యెన్నో యజ్ఞము లర్థిసత్క్రతువులె న్నెన్నొ వివాహంబులన్
యెన్నో యుత్సవ ఘద్య కూపతటముల్ యేర్పాటులన్ జేసినన్
జెన్నొందన్ శివభక్తికిన్ సరియగున్ ......

మ॥ కపటంబుల్ మదిజెంది వర్తిలుజనుల్ గానంగదుష్కీర్తిజెం
దుచు రాభంబును బొందు సత్యమననేదో నోటరాకుండు

దా నెపుడున్ యీశ్వరబుద్ధిగల్గి దిరుగన్ నెన్నంగ గదా దోషముల్
శిఖివిష్టా!నను దంభు జేయకుము శ్రీ......

మ॥ మతముల్ గొంటు సమస్తభోగహితమౌ మార్గంబులన్ బోదు సం
గతమైపొందదు కామినీమణుల సంగత్యాగియౌ సౌఖ్యదుః
ఖతతుల్ రెంటిసమానభాగములుగా గాంచున్ మదిన్ యోగియౌ
చితమౌ జ్ఞానసుఖంబులందును గదా! ......

శా॥ అన్నంబే భుజియించుట న్విడచి దా నాకుల్ పండులన్ దింమనే
నన్నింటిన్ విడనాడినాడనని గర్వాలాపముల్ నాడు దా
నన్నంబేయకుగాక వేరగునె యాయన్నంబువీడగ య
చ్ఛిన్నానందసుఖాబ్ధి దేలగలరే ......

మ॥ అడవుల్ వాసము జేసి కందఫలముల్ నాసక్తితో మెక్కి యీ
జడదేహాదులయందు నాసలవడిన్ జాలించి నియందునన్
గడుచింతాపరులై నిరాలస్యులై గానంగలేరెప్పుడున్
చెడరే తామసులై వృథాపృథివిపై ......

శా॥ కాశిం జేరిన గంగలో మునిగినన్ కాంతారమధ్యంబునన్
దాళల్ బోవగ నష్టతోదపములన్ దారేకులన్ జేసినన్
శ్రీశైలంబున కేగివచ్చినను సచ్చిత్తంబు లేకుండినన్
శ్రీశైలాగ్రనివాసమెల్ల వృథయౌ ......

శా॥ నాసాగ్రంబున మండలత్రయములో నామధ్యవీక్షింపగా
బోసం బేమియు లేక కోటిరవిసందోహంబునై జ్ఞానమై
వాసింగాంచక స్వల్పమై యణువునై వర్తించుచిర్లింగమున్
శ్రీసిద్ధుం డిల జక్షులందు గనునే ......

శా॥ దారున్ మృత్తు శిలాదులున్ రజతమున్ తామ్రాదిపాత్రాదిన
త్కారంబుల్ రచియించి దైవమని సత్కార్యంబులన్ జేయకే
సారంబై యచరంబునై విమలమై సానందఖండంబుగా
జేరన్ వెల్గెడు నిన్నుగాంచరు జనుల్ ......

శా॥ దీనుండర్థుడ పాదసేవకుడ బాందేన్ బద్ధ జంతుక్రియన్
బోనుం జిక్కితిదారిదోచకేటులన్ బోవంగనేరన్ సుమీ
గానన్ నీవిపుడైననాకు ధరణిన్ గాపుండు సంసారమున్
ఛీ నింకించుము భక్తిగూర్చుము శివా ......

శా॥ వ్యాసాంగీరసనారదాత్రిభృగుడున్ వాల్మీకదూర్వాసు
లా గాసిం గాంచిన మౌనులెల్ల నడవేవాసంబుగా జేసుకన్
ఆశాపాశములందు జిక్కక వెసన్ న్నాబ్రహ్మజిజ్ఞాస జే
సే సాధుల్ గడతేర గల్గిరిగదా ......

మ॥ సిరులున్ గాంచనధాన్యసంపద తురంగాందోళికాదుల్ మహా
వరరూపాఢ్యసతుల్ భువిన్ గలిగినన్ వ్యర్థంబులేయంచు సం
స్థిరమైనట్టియు నీపదద్వయము సంసేవల్ దగన్ జేయుచున్
స్థిరులై వెల్గు మహాత్మ సిద్ధపురుషున్ ......

మ॥ తనువుల్ మూడిల మూడవస్థలుగదా తర్కింపజీవత్రయం
బనురంధ్రింబులు తొమ్మిదిస్వముకలున్ భావింప రక్తంబులున్
చనమూత్రంబు పురీషసంతతులమించన్ గల్గినర్తించు నీ
చెనటుల్ దేహముజూచి భ్రాంతిపడరే ......

మ॥ బసవాయంచును యెవ్వడేని సుమనోభావంబుచే బేర్కొనన్,
వెసదూకంజనకుండునే యఘములున్ వీక్షింపగా సూర్యునిన్
వసుధంబుట్టినమంచురీతిని జనున్ వాక్కాయకర్మంబునెం
చి సుశీలత్వముచేత గొల్చిన జనుల్ ......

మ॥ తనువందున్ గురులింగమున్ జెలగుచో తర్కింప వామానసం
బనుపంబై గురులింగమందునెపుడున్ బంధించలేకుండినన్
జనునే మాయవిరించియైన గడువన్ శక్యంబు గాదండ్రు యీ
చెనటుల్ యేవిధిముక్తిగల్గు నిలలో......

మ॥ అతులంబై విమలంబునై యజడమై యాగామిప్రారబ్ధసం
చితముల్గాగనుమించి వెల్గుపరమై చింతింపగా నెంచునన్

గతులన్ దెల్యనిదై ప్రభుండ తుదమొదల్ గాకన్ సదావర్తియుం
చితనీరూపము నిర్ణయించ దరమా......

మ॥ పలుకుల్ కందవు భావమందు నెప్పుడున్ భావించిచూడంగ నిం
దలపంజూపులయందు గన్పడవు చోద్యంబయ్యె నీరూపమున్
యలతత్వంబును నిత్యమంచు బలుకన్ యూరూఢితో శాస్త్రములు
చెలగ న్నే విధినిన్ను గాంచనగునో ......

మ॥ చపలాత్ముండను కల్మషుండ కుమతిన్ శౌర్యాతిరేకంబుచే
నపరాధంబులు పెక్కుసల్పితి మతిన్ నాసక్తిచే మిమ్మునే
నెపుడున్ గొల్వగనైతి నెట్టులోగదా నీసత్కృపన్ బొందుటన్
జెపి యింపం గని ముక్తినివ్వవె శివా......

మ॥ విషయానందము మానకన్ దిరుగుసర్వేంద్రియములందున్ గనున్
విషయేచ్ఛల్లనిసంతసించు నెపుడున్ వేమారకన్ దీక్షతో
మిష నెచ్చోటనో దీని మాన్పదగు నీమిత్రత్వమున్ జూపి ని
ర్విషయానందుని జేసి బ్రోవగదవే

మ॥ మనసా నిల్కడగానరాదుగద కామాంధంబునన్ బొందినన్
ఘనమా నీకు హితంబ నీసహజమా కర్మాదులన్ నొంద నీ.
తనుఫల్ బుద్బుదమంచు బల్క వినియాత్మార్థసంవేది డా
శివశ్రీకంఠుని భక్తిగొల్వగదవే ......

శా॥ సర్వార్థంబులకాదియై సుకృతమై శాంతంబునై పూజ్యమై
నిర్వాణప్రదమై నపారతరమై నీహారశూకంబునై
గర్వోద్విష్ణుకరాళిఖండితము నా కాత్యాయనీనాథ ను
శ్రీర్వాగమ్యు భవాదృశుండు గలడే......

శా॥ శ్రీకళ్యాణగుణాపహం రిపుహరం శ్రీశంభు చింతామణిం
లోకైకస్తుతగౌరినాథమనిశం లోకైకనాథం భజే
పాకారాతిసమస్తదేవవినుతం పాలాక్షయం చెన్నదగ
శ్రీకైలాస నివాస యీశ యభవా......

మ॥ [illegible]ధ్యానంబులు యోగముల్ జపములు స్నానాదానసంధ్యావళుల్
భువిసద్భూసురదానముల్ వ్రతములన్ భోగేచ్ఛకై యాగముల్
సువనిన్ జేతురు ముక్తిసంపదకునై యాశ్చర్యమౌచుండగా
శివ నిన్ గొల్చినముక్తి నివ్వదె సదా......

మ॥ నీనామంబు సమస్తలోకములకున్ నిర్మోహసంధానమౌ
కన్నా మిన్న పఠింపగల్గు విలసత్ కారుణ్యసంసిద్ధియో
యన్నా యెన్నగశక్యమే యొరులకున్ నార్తుండ గావంగదే
చెన్నారం భవదంఘ్రిసేవకుడనే.....

మ॥ గురువోంకార మకారయుక్తమగుచున్ గూడ న్నకారంబులో
పరయంజేర్చి యకారమున్ బసవయున్ పంచాక్షరింగల్పి యా
పగుసంగూర్చి పఠించిరన్ గలుగవా వక్తృత్వమున్ జ్ఞానమున్
స్థిరమైనట్టియు నెల్లవాంఛలు సిరుల్ ......

మ॥ గురువుల్ జెప్పినబుద్ధిమెల్లక సతుల్ గోరంధనంబిత్తురే
నెరుగంబో శిల నాత్మలింగమును యీనీచాధముల్ భక్తిచే
పరదైవంబుల గొల్చి నిదకథలన్ పాటించి నీయందునన్
స్థిరమైనట్టియు బుద్ధిలేక చెడరే ......

మ॥ శ్రుతులభ్యాసముచేసి శాస్త్రకరిమున్ శోధించిరన్ భాష్యసం
గతులందేరి చరించిరన్ విమలలింగజ్ఞాన సందర్భసం
తతులం దెల్యక ముక్తిలేదని గడున్ తర్కించి యార్యాళి సం
స్థితులై దెల్పిన భక్తినిల్పరు జనుల్ ......

మ॥ శివయంచున్ భువిరెండు యక్షరమున్ శీఘ్రంబె సేవించినన్
భవముల్ బోవును ఘోరపాతకునకున్ భగ్నంబుచేకూరు నా
పవనుండూచిన మేఘసంఘముగతి పాయుంగదా నీకృపన్
శివ నీనామము మంత్రరాజముగదా......

శా॥ పాపం బాత్రి సనత్కుమార మునులే స్వామిన్ దగం గొల్చిరో
జ్ఞానుల్ యోగిసనాతనాది ఘనులే జ్ఞానాత్మ సేవించిరో

నానాదేవతులెల్ల మ్రొక్కులిడు నానామార్గవర్తుల్ శంభున్
జెనర్ క్రొవ్వు మనంగ ముక్తినిడదే

మ॥ ఇలపైనన్ దలక్రిందుగా బడిన దానెంతైన మోక్షంబనన్
దలక్రిందన్ గల గబ్బిలంబులకు నెంతన్ మోక్షము న్నబ్బెనే
శలఖన్ సత్క్రియ యోగిగాక నినుసంధానింప నెట్లబ్బుగా
సిలి యోగంబుల ముక్తినొంద గలరే.....

శా॥ అంతానిండినవాడవై జగములందాడూడిచే జీవులన్
సంతాపంబులు దుఃఖముల్ మిగుల నీసంసారబంధంబు
నన్ చింతల్ బట్టి యణంగద్రొక్కితివి నిం జేరన్ యుపాయంబు నా
సంతైనన్ గృపజేయవా కపటమా......

మ॥ గురుడే దైవము తల్లిదండ్రియతడే ఘోరాంధసంసారమున్
దరిజేర్పంగల కర్త శాస్త్రహితబోధల్ జెప్పగా భర్త యా
దరణంబొప్పగ దృష్టప్రత్యయములన్ వారాహతిన్ జూపి సు
స్థిరచిత్తంబున బ్రోచు నిల్లవిధులన్ .....

మ॥ జననంబే బహుదుర్ఘటంబుగద నీజన్మంబు కర్మంబునే
ననయంబున్ శివభక్తిలేమి కడిమిన్ యల్పంబుగా జచ్చుచున్
జననంబెత్తుచు నిన్నుగాంచనిక నీజన్మంబుజాలించు గా
ల్చినగాని ఫలితంబునొందదు శివా .. ...

శా॥ అయ్యా నామొఱయాలకింపవుగదా నాయయ్య నిన్ వేడినన్
చయ్యంరాగదవయ్య నీచరణసంసక్తి ప్రపూజింతు నే
నయ్యా యయ్యనియంత వేడిన నినున్ నాలింపవయ్యాయ్య మో
జయ్యా చిక్కులు బెట్టకే కటకటా......

శా॥ స్నానంబుల్ పదివేలుచేయ ధరలో సంధిల్లనే ముక్తియా
మీనంబుల్ గడుకర్కటాదులును సమ్మోదంబుచే నీళ్ళలో
నానంగామరి ముక్తిగల్గె నసదానాకేంద్ర సంపూజ్యనం।
చిన్నంబుచ్చక వేగమేలుకొనవే ......

మ॥ దధిజంబై తగు వెన్న గాచినటు సంధానింప కల్యాంగరా
న్వ్యధితత్వంబు నెరింగి పూర్ణుఁడయి దానే వేదమర్మంబులన్
వ్యథయించున్ విశి సన్యసించి పరమోద్వృత్తిన్ తదాత్మైక్యుఁడై
చెదరంగాని పదంబు జెందును గదా ......

మ॥ అలచిన్మూర్తి నెరింగినట్టి ఘనుఁడా యర్ధాంగితో నున్న నే
మిలలో సన్యసియైన నేమి వనభూమిన్ జేరినన్ నేమి కా
దలబ్రహ్మాత్మకుఁడైన నేమి యదియే యజ్ఞాననాశంబుగా
జెలగున్ గాదె భువిన్ మహాత్ములకు నో ......

మ॥ నటనంబుల్ గడురాగతాళ తతులన్ నాసక్తితో జేయుచున్
నటుఁడా నెత్తినమున్న తొందరను విన్నాణంబుతో జూచుచున్
నటనన్ జేయును జ్ఞానియెల్లధరలో నానార్థసంచారుఁడై
చిటికెనన్ జరియింపకుండ దిరుగన్

శా॥ తాఁ గావించు విచిత్రరూపతతులన్ దాసత్యమంచున్ నెరిం
గీగాంవించెదు సిద్ధజాలకుని భంగిన్ మాయసంసారమున్
దాఁ గావించుచు బ్రహ్మయోగి పుడమిన్ దర్కించి లేదంచు నెం
చీగై కోఁడు నిలింపు సత్పదవులన్ ......

శా॥ స్నానంబే సమదృష్టిజీవులగనః శాంతంబు గంధంబు
కర్మన్నిందించుట నక్షతల్ మనసు నిర్మాల్యత్వమే పుష్పమా
జ్ఞానాగ్నిన్ బడగాల్పు దుర్గుణములన్ గావించుటే ధూపమా
చెన్నారన్ నెరుకేచు దీపము శి..

మ॥ నైవేద్యంబలభక్తి హస్తజలముల్ నానంద బాష్పంబులన్
గావింపన్ నటుకూడ నా త్రిగుణముల్ గావించు తాంబూలమే
సేవింతున్ విధి ప్రాణలింగమున కా సేవల్ విధిన్ సల్పు నీ
సేవాదుల్ ననుబొందఁ జెప్పఁగదవే ......

శా॥ సంపెంగల్ విరజాజులున్ పొగడలున్ చామంతులున్ జాజులున్
సొంపై నట్టియు పారిజాతము సత్సూనంబులన్ గూర్చియున్

సంప్రీతిఁ గడుగంధమక్షతలతో సాధించి పూజించి
నాసింపఁ జ్ఞానముఁగల్గు నందు విబుధుల్ ......

౪॥ నీరందుద్భవమొంది మీనముగఁ డుఁ నీరందువ ర్తించి యా
నీరుఁ నంటనియట్లు సర్వఫలముల్ నిందించినిశ్చింతులై
శ్రీరంజిల్ల ప్రపంచముఁ దిరిగినఁ చిత్తంబుఁ దోషముల్
చేరంగానవటంచు బల్కిరి బుధుల్ ......

౫॥ జననంబాయెన నాత్మయుం జనముల్ జన్మంబు లేదాత్మకుఁ
యనగా విన్న విమర్శ జేయ బయలై నానాదిశల్ నిండగా
జననంబేది చెడంగఁ బోవునది యంచున్ లేదటంచెంచి గాం
చినదంతఁ గని బ్రహ్మమ చెరుగరే ......

౬॥ వినుటఁ గానిది స్పర్శ జేయఁ ది దావీక్షించుటల్ గానిదీ
ఘనిబూనఁ గసుగంధముల్ గొనదె యేచ క్రఁ వచింపంగదె
జనదేయట్టిటు జేయదెట్టి పనులఁ జర్చింపదీయాత్మని
చెనటుల్ గాఁరు దేహమంటదనుచున్......

౭॥ నేనేమన్నను నొక్కటేమరిగదా నీవన్నని కొక్కడా।
నేనే నీవయి యొక్కటై బరగగా నిక్కంబుగా నామముల్
దా నేమిధ్యయనిత్యమై నిరుపమై తక్కంగ బ్రహ్మార్థముఁ
శ్రీనాథామృత భావమైన దిదియే ......

౮॥ నీరూపంబు లనంతమై నిలయు నేన్ నేడంచు వర్ణింతును।
రారామన్మథహంతచిన్మయుఁడ చిన్మూర్తియే సారాకార
రారారాజసుమిత్రయంచు మదిలో రాత్రింబగల్గొల్తు నం
జేరందీశ క్షమింపు దోసములనో ......

౯॥ తప్పొప్పుల్ గడు నాకునుం దెలియవే తన్మాత్రుడఁ మాధతఁ
జెప్పంగఁ వినసైతి ద్రోహగుణముల్ జెందుందు నాయందునన్
జెప్పఁ సిగ్గగునుర్వియెల్ల జనమున్ ఛీయంచునిందించగా
చెప్పన్ దొడ్డిలినన్ను బ్రోవుమనుచున్। ......

# నాగేశ్వర శతకము.

మ॥ అతిలోభిన్ గరుణావిహీనుడను గామాంధుండ దుశ్చిత్తుడన్
మతిచాంచల్యుఁడ కోపినాసకుఁడ బొంకన్నాకునీ యిష్టమున్
గతిదుస్సంగమెగాని సజ్జనులనన్ జేరంగఁబోదయ్య యీ
క్షితియందిట్టి గుణాళిద్రుంచుము శివా ......

మ॥ నీవే దిక్కనినమ్మినాఁడ వినుమా నిక్కంబు నామాట నా
దేవేరీగలదే మొఱెప్ప నినుదా దేహంబునందాల్చినం।
ధ్యానంబొప్పఁగ బూజచేయుచును నా భావంబునన్ నిన్నె
సేవంజేయుట నుంటినని నెఱుగవా॥ ......

మ॥ తనువే శాల సుచిత్తగుండముగ సద్ధిన్ షడ్గుణంబుల్ యహం
బనఁచింబోతురు వాయుపూరకములన్ పగ్గంబుచేగట్టి యా
మనసే యూపమునంగ చిత్తమఖమున్ మాన్యాత్ముఁడై చేయ నెం
చిన శ్రీకంఠుని గాంచుచుండు నిపుణున్......

మ॥ కవులంచున్ ఘనపండితాళులనుచున్ గానంబుతో సత్కథా
శ్రవణంబుల్ గడుచేయుచుండు హరిదాసాధీశులంచున్ సదా
యవనిన్ దేశములెల్లడన్ దిరిగి ద్రవ్యాధీశు సేవించుచున్
శివనీ శేవలు వీడికొందురు ధరన్ ......

శా॥ సాకారత్వముచేత భక్తులకు నీసంకాశముల్ జూపి నా
యాకారంబులద్రుంచి దుష్టతనముల్ నాశంబుగావించి యా
శ్రీకైలాసమొసంగి తౌరమములన్ చీకాకునన్ బెట్టకన్
చేకోరా మది నా పిసత్వమునహో ......

మ॥ కరుణావాప్తి దయాసముద్ర కరుణాగాంభీర్యవారాశి నీ
చరణవ్యాప్తుని నన్ను సత్కరుణతో సాకంగ విస్తారమా
బరువా భక్తుల పెన్నిధానమనుర్విన్ భాషింప రేయార్యులున్
స్థిరకైవల్యము నాకొసంగు దయతో ......

మ॥ శివుకన్నన్ ఘనదైవమొండుగలదే చింతించి చూడంగ నా
శివునిన్ నిందయొనర్చు యజ్ఞులకు దా సిద్ధించునే మోక్షముల్

శివభక్తిన్ పరతాంభద్రి భవునకున్ జెప్పగా సూక్తుల్
చెవియొగ్గా వినలేదా మందమతులై। ......

మ॥ శివుడే దైవము నొక్కడంచు దలతున్ సేవింతు పాదంబులన్
భవనాపాలిటికల్పవృక్షమనుచున్ భావింతు నశ్రాంతమున్
భవసేవామృతపాన నిచ్చియెపుడున్ దారిద్ర్యోలంఘించరే
శివనాపాలిటి పెన్నిధానమగుమా॥ ......

# కవివంశావళి

సీ॥ మహివీరశైవైక మార్గానువర్తియై చేబ్రోలుపురమున సిరిచెలంగ
వసియించె నడిపూడి వంశాబ్ధిచంద్రుండు కోటయాఖ్యుండు స
త్కవికుండు సద్గుణంబులచేత సాధ్వియంచుజనాళి బొగడంగ
సత్కీర్తి బొందినట్టి అంబకుసరియన నంబుమ్మయను సుధీమణిని
పెండిలియయ్యె మహితయశుడు। గీ॥ అట్టివారలయందున నంద
ముగను। భవవిదూరులు దుర్దోషభంజనులన। నొనరనలుగురు
సత్పుత్రులుద్భవిల్లి। ప్రబలసత్కీర్తిగాంచిరి పుణ్యవృత్తి॥

గీ॥ అందునగ్రసుతుండునై యలరుచున్న
మల్లయాహ్వయుడననొప్పు మాన్యశీలుడు।
భూతలంబునువిడచి యా భూతనాథు
సన్నిధిని జేరియుండెను సంతతంబు॥

సీ॥ శ్రీకరంబుగ వీరశైవమతంబున కధ్యక్షతవహించి యలరుచుండు
చేబ్రోలుపురమున సింహాసనస్థుడై యలరుచుమఠములో నధిక

భక్తి లింగాంగసమర విలీనమానవినోది సత్యశీలవ్రతాచారనిరతు
శిష్యబృందములెల్ల చేనుతింపఁ బహుపురాణంబులు ప్రస్ఫుట
ముగ। గీ॥ జెప్పుచుండునుమ మ్మడి శిద్ధశంభు స్వామియనగను
మహిజనుల్ సన్నుతింప। భువినిసత్కీర్తిగాంచిన పుణ్యమూర్తి
పూజ్యతముడయ్యె మూడవపుత్రుడలమి॥

మ॥ అతిశాంతుండు దయాకరుండుసుగుణ। స్తోమైకశీలుండు సం, తత
లింగార్థవినోది మోక్షపదప్రాప్త్యర్థుండటంచుఁ సదా స్తుతులం
గాంచె చతుర్థపుత్రుఁడిలలో శోభిల్లకోటయ్యనాఖ్యత చేతన్ విల
శిల్లు నెప్పుడు మహాఖ్యాతిఁగడుఁ ధీరుడై॥

గీ॥ ఏనురెండవసూనుఁడ నిందుధరుని
సేవనాసక్తశీలినై చెలగువాఁడ
సరవినాగేశ్వరస్వామి శతకమిపుడు
జేసి శివునికి హారంబువేసినాఁడ
నాగభూషణదేవర నామకుండ॥



